## పొగాకు చట్ట నిబంధనల ఉల్లంఘన

బాపట్ల, సెప్టెంబర్ 5: పొగాకు చట్ట నిబంధనలను ఉల్లంఘించిన నేరానికిగాను, అడిషనల్ ఫస్టుక్లాసు మేజిస్ట్రేటు డి. వి. సుబ్బారావుగారు, సీతారామయ్య అనేవానికి రు 15 వేమయ్య అనేవానికి రు 25 జరిమానావిధించారు.





Printed and Published for Nageswara Rao Estates Ltd. by S. Radha Krishna, at The Andhra Patrika Press 5 & 7 Thambu Chetty St. Madras-1. Editor, S. Sambhu Parsad.

## నంద్యాలలో మానభంగం

### రైల్వే పోర్టరు అరెస్టు

నంద్యాల, సెప్టెంబరు 5: ఒక ముస్లింయువతిని బలాత్కరించి మానభంగం చేశాడనే ఆరోపణపై నంద్యాల రైల్వేస్టేషన్ పోర్టరు సుల్తాన్‌ను పోలీసులు అరెస్టుచేసి రిమాండులో ఉంచారు. ఆగస్టు 30 తేదీ రాత్రి మెయిలు దిగి ఆమె స్టేషనులో ఉండగా సుల్తాన్ జట్కా బండిపై ఎక్కించుకుని, దూరంగా తీసుకువెళ్లాడని అక్కడ బలాత్కరించాడని చెప్పబడుతున్నది.

పోలీసులు కేసు యింకా దర్యాప్తు చేస్తున్నారు.

## సంఘ సేవకుని ఆయుధాగారం

### అలాందులో పోలీసు వశం

గుల్బర్గా, సెప్టెంబరు 5: ఈ జిల్లా అలాందు గ్రామంలో అన్నారావు పాటిల్ అనే సంఘ సేవకుని యింటి, ఒక చిన్న ఆయుధాగారాన్ని, గుల్బర్గా పోలీసులు ఆగస్టు 31 తేదీ వశపరుచుకున్నారు. స్టెన్‌గన్, రైఫిళ్లు రివాల్వర్లు, ఫిరంగులు, గ్రెనేడ్లు, తుపాకి మందు, వగైరాలు పట్టుబడ్డాయి.

అన్నారావు పరారీలో ఉన్నాడు. ఆయన తండ్రిని అగ్ర సోదరుణ్ణి అరెస్టు చేశారు.

అదే రోజున, అలాందులో ఇంకా అనేక యిళ్లు సోదాచేసి, ఒక రైఫిల్ పట్టుకున్నారు.

ప్రేలుడు వస్తువుల తనిఖీ ఉద్యోగి (ఇన్‌స్పెక్టరు) నాగపూరునుండి కనిపెట్టడానికి వచ్చారు. పోలీసులు పట్టుకున్న మందుగుండు సామగ్రి మేజస్ట్రేటు సమక్షంలో నాశనం చేయించారు.

భుసునూరు గ్రామానికి చెందిన భైరప్పపాటిల్ ఇంట్లో ఒక నాటు బాంబును పోలీసుపట్టుకున్నారని, అతనుఇచ్చిన ఆచూకీని బట్టి, అన్నారావు యింట్లో ఆయుధ సామగ్రి వశపరచుకోగలిగారని తెలుస్తున్నది.

## విజయవాడ పురపాలకసంఘం

విజయవాడ, సెప్టెంబరు 4: ఆంధ్ర ప్రభుత్వ ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారికి విజయవాడ వచ్చినప్పుడు పౌర సన్మానం చెయ్యాలని పురపాలక సంఘం నిన్న సాయంకాలం తీర్మానించారు. పోరిన గణపతిరావు పాత్రుడు గారు అధ్యక్షత వహించారు.

ఈ తీర్మానాన్ని చలపతిరావుగారు వ్యతిరేకించారు. "ఆంధ్రరాష్ట్ర అభ్యుదయానికి అంతరాయం కలిగే విధంగా, ప్రాంతీయ దురభిమానాలను రెచ్చగొట్టిన, భారత పౌరుల ప్రాథమిక హక్కుల భంగంకలిగే రీతిని తమ ఉపముఖ్యమంత్రి పదవిని దుర్వినియోగం చేసిన సంజీవరెడ్డిగారికి పౌరసన్మానం చేయటం వాంఛనీయం గాద"ని శ్రీ చలపతిరావు ప్రతిపాదించిన సవరణ వీగిపోయింది. సవరణకు అనుకూలంగా ఇద్దరు మాత్రం-డా॥ చలపతిరావు, డా॥ విష్ణువర్ధనరావుగారలు-వోటుచేశారు.

(స్వ. వి.)

## వరంగల్లులో మరొక క్షయ ఆసుపత్రి

వరంగల్, సెప్టెంబరు 4: డాక్టరు సుబ్బారావుగారు నెలకొల్పిన "రామకృష్ణ శానిటోరియం"కు ఆగస్టు 31 వ తేదీన జిల్లా కలెక్టరు శ్రీ అనిల్ షే ప్రారంభోత్సవం చేశారు. సెషన్సు కోర్టు జడ్జి శ్రీ పి. శ్రీరాములు సభకు అధ్యక్షత వహించారు.

ప్రభుత్వ అజమాయిషీలో భారత సేవా సమాజం త్వరలో ఇక్కడొక ఆరోగ్యకేంద్రం నెలకొల్పనున్నారు. అదికాక డాక్టరు వీరన్నగారు లోగడ ఒక క్షయరోగుల ఆసుపత్రిని ఏర్పాటుచేశారు. ఇప్పుడు సుబ్బారావుగారు మరొకటి నెలకొల్పారు.

జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ టి. హయగ్రీవాచారి, పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు టి. ఎస్. మూర్తి, శ్రీయుతులు జె. లక్ష్మీనారాయణ, ప్రహ్లాదరావుగారలు ప్రసంగించారు.

## బళ్లారిపై కన్నడుల మహజరు

### రాయదుర్గంలో సహాయ నిరాకరణ

రాయదుర్గం, సెప్టెంబర్ 4: బళ్లారి మైసూరురాష్ట్రంలో ఉండాలనే దెను అభిమతిస్తుంటూ కేంద్ర ప్రభుత్వానికి మహజర్లు పంపడానికి కన్నడ నాయకులు కృషి చేస్తున్నారు. దీనికి రాయదుర్గంలో గట్టి పరాభవం జరిగింది.

బళ్లారి శాసనసభ్యురాలు శ్రీమతి అల్లం సుమంగళమ్మ, మరికొందరు కన్నడ నాయకులు, మహజరు తయారు చేసి, దానిపై యీ పట్టణ ప్రజల సంతకాలకోసం వచ్చారు. ప్రజలెవరు సంతకాలు పెట్టడానికి నిరాకరించడమేగాక న్యాయంగా ఆంధ్రరాష్ట్రంలో చేరవలసిన బళ్లారిని, ప్రజల అభీష్టాన్ని కూడా నిర్లక్ష్యంచేసి మైసూరులోకలిపివేయగా ఆ అన్యాయాన్ని సవరించ చేయడానికి వీరు చేస్తున్న ప్రయత్నాన్ని తీవ్రంగా గర్హించి పంపివేశారు.

# పురపాలక ఉద్యోగుల నియామకంలో జాప్యం

## తెనాలి సంఘం ఆక్షేపణ

తెనాలి, సెప్టెంబరు 4: తెనాలి పురపాలకసంఘం ఆగస్టు 31వ తేదీన సమావేశమైనప్పుడు ఈ పురపాలక సంఘం కమీషనరు ఆరోగ్యశాఖాధికారి పదవులు ఎప్పుడు ఖాళీ అయినా ఆ పదవులలో కొత్తవారిని నియమించే విషయంలో ప్రభుత్వం చేస్తున్న జాప్యానికి అధిక్షేపణ తెలియ చేసే నిమిత్తం సభను వాయిదా వెయ్యాలని టి. ఎస్. నారాయణమూర్తిగారు ఒక తీర్మానం ప్రతిపాదించారు. సభ ఏకగ్రీవంగా ఆమోదించి కొన్ని నిమిషాలు వాయిదా వేశారు. ఆసమావేశానికి ఎ. గోపాలకృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు.

ఆ తరువాత గోవా స్వాతంత్ర్యోద్యమంలో మరణించిన సత్యాగ్రహుల పట్ల గౌరవసూచకంగా మరోనిమిషం సభను మరొకసారి వాయిదా వేశారు.

పట్టణంలోని ముఖ్యమైన వీధులలో మెర్క్యురీ విద్యుద్దీపాలను ఏర్పాటు చేయించాలని నిర్ణయిస్తూ ఒక తీర్మానం చేశారు.

## కర్నూలు భీమా కంపెనీల సంఘం

కర్నూలు, సెప్టెంబరు 5: కర్నూలు భీమా కంపెనీల సంఘానికి నిన్న సహకార శాఖ మంత్రి సంజీవయ్యగారు ప్రారంభోత్సవం చేశారు. ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ స్థానికశాఖ మేనేజరు పల్లూరి రామారావు గారు అధ్యక్షత వహించారు.

సోదర భీమా కంపెనీల కార్యకర్తల కూ మంత్రికీ స్వాగతం చెబుతూ రామారావుగారు ఇట్లా అన్నారు: "ఎప్పుడు ఎవరికి అవాంతరం వస్తుందో చెప్పలేం. ఈ రోజులలో ఉద్యోగంలో ఉన్న వారికే నిరుద్యోగులకూ-అందరికీ భీమా పద్ధతిఒక తిరుగులేని పాయం. భారతదేశంలో భీమావ్యాపారం శైశవావస్థలో ఉంది. కార్యకర్తల కృషి ఫలితంగా భీమా చేయించుకొనేవారి సంఖ్య పెరిగింది. భీమా చేయించుకోవాలనే మన స్తత్వం ప్రజలలో కలిగించవలసిన బాధ్యత ఏజెంట్లమీద ఉన్నది. ఎటువంటి భేదాలూ లేకుండా, ఏజెంట్లందరూ ఏకాభిప్రాయంతో ఉత్సాహంతో పని చేస్తారని ఆశిస్తున్నాను."

మంత్రి ఇట్లా అన్నారు: ఈ విషయం ఎక్కువగా నాకు తెలియదు. ఈ వృత్తిలో అనుభవజ్ఞులైన రామారావుగారు చెప్పవలసింది చెప్పారు. తెలుసుకొనడానికి కూడా నేను ప్రయత్నించలేదు. ఇతర దేశాలలో పదివేలకు కొన్ని వేలమంది భీమాపట్టాలు తీసుకొంటూంటే మన దేశంలో 25 మంది మాత్రమే భీమాచేయించుకొనడం విచారించదగ్గ విషయం. ఈ ఉద్యమం ఇంకా బాల్యదశలో ఉన్నది. మీ సంఘంకూడా బాల్యదశలోనే ఉన్నది. వార్షికోత్సవాలు జరుపుకొనడంతో తృప్తిపడక తరచుగా కలుసుకొంటూ ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకొంటూ పనిచేయడం అవసరం. త్వరలోనే సొంత భవనం కూడా ఏర్పాటు చేసుకొనగలరని ఆశిస్తున్నాను."

సి. సుంకిరెడ్డిగారి వందనాలు చెప్పారు.

## ఆంధ్ర ముఖ్య మంత్రి కార్యక్రమం

కర్నూలు, సెప్టెంబరు 5: ఆంధ్ర ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు ఈ నెల 7వ తేదీన ఢిల్లీ నుండి తిరిగి వస్తారు. ఆ రోజు రాత్రే గుత్తి వెళ్లి, ఆ మర్నాడు, ఉదయం అక్కడ మద్రాసు ఆర్థిక మంత్రి సుబ్రహ్మణ్యంగారికి స్వాగతమిస్తారు. ఇద్దరూ కలసి అనంతపురం వెళ్లి అక్కడి ఆగ్రికల్చరల్ కాలేజి, సాంకేతిక కళాశాల, ఇంజనీరింగ్ కళాశాల మొదలైన వాటిని సందర్శిస్తారు. మర్నాడు (9వ తేదీ) ఉదయం ముఖ్య మంత్రి కారులో బయలుదేరి 10 గంటల కల్లా బెంగుళూరు చేరుకుంటారు. పదవ తేదీన, భారత ఆటోమొబైల్ సంఘం మైసూరుశాఖకు ప్రారంభోత్సవం చేస్తారు. 11వ తేదీన హిందూపురం, అక్కడ నుండి పెనుకొండ వెళ్తారు. 12వ తేదీ ఉదయం పెనుకొండ నుండి బయలుదేరి మధ్యాహ్నానికి కర్నూలు చేరుకుంటారు.

### కర్నూలు జిల్లా కాంగ్రెసు సంఘం

కర్నూలు, సెప్టెంబరు 5: కొత్తగా ఎన్నికయిన జిల్లా కాంగ్రెసు సంఘం ఈ నెల 15 తేదీన ఇక్కడి కృష్ణస్వామి సత్రంలో సమావేశమై కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకుంటారని అధ్యక్షుడు పి. వెంకటసుబ్బయ్యగారు ప్రకటిస్తున్నారు.

### అనంతపురంలో రెండవ పోలీసు ఠాణా

అనంతపురం, సెప్టెంబరు 2: ఇక్కడ నెలకొల్పిన రెండవ పోలీసు ఠాణాకు జిల్లా కలెక్టరు కె. కొండలరావుగారు నిన్న ప్రారంభోత్సవం చేశారు. కొత్త ఊరు ప్రాంతం అంతా ఈ ఠాణా పరిధిలోకి వస్తుంది. (స్వ. వి.)

## బుడమేటి ముంపు నివారణపథకం

### వెంటనే అమలు జరపాలి

తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యదర్శి విజ్ఞప్తి

బందరు సెప్టెంబరు 4: "బుడమేటి ముంపువల్ల ప్రతి సంవత్సరం పంటలకు నష్టం కలుగుతున్నది. గుడివాడ తాలూకా పులిపాకాల, లబిపాకాల, పెదలింగాల, పెట్టపంజ, జొన్నపాడు, మొదలైన గ్రామాలలో బుడమేటి ముంపువల్ల పంటలు మునిగి బాగా దెబ్బతిన్నాయి. కనుక 25 లక్షల అంచనాతో తయారు చేసిన బుడమేటి ముంపునివారణ పథకం వెంటనే అమలు జరపాలి" అని తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి మండలి వెంకట కృష్ణారావుగారు ఆంధ్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు.

ఈ విజ్ఞప్తిలో వీరు జొన్నపాడు, పుట్టగుంట గ్రామాల మధ్య వరదముంపువల్ల బందరుకాల్వమీద నీరు ప్రవహిస్తున్నదనీ పుట్టగుంటవద్ద చేలన్నీ మునిగి సముద్రంలా కనిపిస్తున్నాయనీ తగిన చర్యలు తీసుకోవలసిందనీ ప్రభుత్వానికి హెచ్చరిక చేస్తున్నారు.

## దంపుడు బియ్యం సాధ్యం కాదు

### పనివారు దొరకడం లేదట

భీమవరం, సెప్టెంబరు 4: "మర బియ్యం స్థానే దంపుడు బియ్యం వాడకం ప్రవేశపెట్టాలని విచారణ సంఘం చేసిన సిఫార్సు ఆచరణ సాధ్యంకాదేమో కనిపిస్తున్నది. ఆనకట్టలు మొదలైన వాటి నిర్మాణానికే కూలీలు దొరకడం లేదు. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణానికి దక్షిణాదినుంచి కూలీలను తెప్పించుకోవాల్సి వచ్చింది. ఇటువంటి పరిస్థితులలో దంపుడు బియ్యం తయారీకి వీలు పడదు" అని మంత్రి శ్రీ సంజీవయ్య నిన్న భీమవరం బియ్యపుమరల యజమానుల సంఘంవారు చేసిన సన్మానానికి సమాధానమిస్తూ అన్నారు. శ్రీ కె. నాగభూషణం మంత్రికి వినతిపత్రం సమర్పించారు. వాణిజ్యపన్నుల విధింపు విధానం చాలా అన్యాయం కలిగిస్తోందనీ, ఒకేసారి పన్ను విధించాలనీ, చాలినన్ని రైలుపెట్టెలు ఇక్కడ లభ్యం కావడంలేదనీ మరబియ్యం పరిశ్రమ విచారణ సంఘం సిఫార్సుప్రకారం దంపుడు బియ్యం వాడుకలోకి తెస్తే మరబియ్యం పరిశ్రమ దెబ్బతినడమే కాక వర్తకులు, కూలీలు నష్టపడగలరనీ ఆ వినతిపత్రంలో తెలిపారు. విద్యుచ్ఛక్తిరేట్లు సవరణచేయించాలని కూడా కోరారు. మంత్రిసమాధానమిస్తూ వర్తకుల కోరికలను సానుభూతితో పరిశీలించగలమన్నారు.

వ్యాగన్ల సరఫరా విషయం రైల్వే బోర్డు పరిశీలనలో వున్నది. ద్వితీయ ప్రణాళికా కాలంలో దీనివిషయమై మరింత శ్రద్ధవహించి పరిస్థితి చక్కదిద్దగలరని ఆశిస్తున్నాను. విద్యుచ్ఛక్తి రేట్ల విషయమై ఇటీవల కొన్ని మార్పులు జరిగాయి. అయినా యింకా పరిశీలిస్తాము అని చెప్పారు.

సభకు శ్రీ ఎ. సత్యనారాయణమూర్తి అధ్యక్షత వహించారు. శ్రీ టి. నరసింహారావు వందన సమర్పణ చేశారు.

గోవా విమోచనోద్యమం:

# సత్యాగ్రహం ఆగిపోవుననే భయం

## కాంగ్రెసు తీర్మానంపై వివిధ భావాలు

బెల్గాం, సెప్టెంబర్ 5: కాంగ్రెస్ సభ్యులెవ్వరూ గోవా సత్యాగ్రహంలో వ్యక్తిగతంగాకూడా పాల్గొనకూడదని అఖిలభారత కాంగ్రెస్ సంఘం చేసిన తీర్మానం ఫలితంగా గోవా విమోచనోద్యమాన్ని బలపరిచేందుకు భారతీయులు సత్యాగ్రహం చేయటమన్నది ఇంక నిలిచిపోగలదనే అభిప్రాయం గోవా జాతీయనాయకులలో ఏర్పడ్డది. కాంగ్రెస్ తీర్మానాన్ని పురస్కరించుకుని, బయటవారు సత్యాగ్రహాన్ని నిలపటానికి భారతప్రభుత్వం ఏదయినా చర్య తీసుకోవచ్చునని కూడా భావిస్తున్నారు.

కాంగ్రెస్ తీర్మానం ఆశాభంగంకలిగిస్తున్నదనీ, భారతీయుల సహాయమున్న అంచనాతో సహాయ నిరాకరణ ప్రారంభించబోతున్న గోవా ప్రజల ఉత్సాహాన్ని ఇది చంపివేస్తుందనీ గోవా జాతీయవాదివర్గాలు అంటున్నారు. అంతేకాక జాతీయవాదులపై కఠిన చర్యలు తీసుకుంటున్న పోర్చుగీసులకు ఇది మరింత ప్రోత్సాహకరంగాకూడా ఉంటుందని అంటున్నారు.

### పోర్చుగీసుల హర్షం

కాంగ్రెసు తీర్మానానికి పోర్చుగీస్ వారు సంతోషపడి, దానిని అప్పుడే ప్రచారానికి ఉపయోగించటం ప్రారంభించారు. భారతీయులు సత్యాగ్రహం చేయరాదని కోరుతున్న ఆతీర్మానాన్ని గోవా రేడియో నేడు ప్రసారం చేసింది. అంతేకాక, బొంబాయిరాష్ట్ర ప్రాంతాలనుంచి గోవాలోకి సత్యాగ్రహులు వెళ్లేందుకు అనుమతించేది లేదని బొంబాయి ప్రభుత్వం ఉత్తరువులు చేసినట్లు బి. బి. సి. రేడియోలో చెప్పారనికూడా ఉదహరించింది.

అయితే నేటిరాత్రి బొంబాయి ప్రభుత్వోద్యోగి ఒకరు బొంబాయిలో ఈ విషయాన్ని ఖండిస్తూ, అటువంటి ఉత్తరువులను పంపలేదని అన్నారు.

### కాంగ్రెస్‌వాదుల ఉపసంహరణ

పూనానుంచి 49 మంది భారతీయ సత్యాగ్రహులదళం ఒకటి గోవా ప్రవేశించుటకు బెళక్కాడకి వచ్చింది. ఈ జట్టు రేపు సరిహద్దులకు బయలుదేరుతుంది. అయితే యిందులో ఉన్న 6 గురు కాంగ్రెస్‌వాదులు కాంగ్రెస్ తీర్మానం దృష్ట్యా ఇందులోనుంచి వైదొలగుతారని తెలుస్తున్నది. తాము అఖిల భారత కాంగ్రెస్ సంఘ ఆదేశాన్ని వ్యతిరేకించేదిలేదని ఆ ఆరుగురిలో ఒకరయిన భంగవంతిసింగ్ యాదవ్ నేడు ప్రకటించారు.

### గోవా జాతీయవాదుల భయాలు

నాయకులంతాకలిసి సంప్రదించుకుని అఖిలపక్ష గోవావిమోచన సంఘంతో సంప్రదించేవరకూ గోవా సత్యాగ్రహ సంఘ అభిప్రాయాలు వ్యక్తం కావు. రేపు గోవా నేషనల్ కాంగ్రెస్ నాయకుడు పీటర్ అల్వరిజ్ సరిహద్దులకు అటూ ఇటూ ఉన్న గోవా జాతీయవాదులతో సంప్రదిస్తారు.

సహాయ నిరాకరణోద్యమాన్ని పరిస్థితులు మారితే ఆపివేస్తారో లేదా ఇంకా తెలియదు. కార్యక్రమాన్ని అమలు జరిపితే, దానికి గోవా ప్రజల సహకారం తప్పకుండా ఉండగలదని తెలుస్తున్నది.

అయితే, పోర్చుగీసునిరంకుశత్వంవల్ల ప్రాణాలుపోగొట్టుకొంటున్న గోవా ప్రజలు విధ్వంసకచర్యలమీద నేనమ్మకం పెట్టుకున్నారనీ, యిప్పుడు యేర్పడ్డ పరిస్థితులవల్ల వాళ్లు ఆ రకమయిన కార్యకలాపాలనే యెక్కువగా అనుసరిస్తారేమోననీ, గోవా నాయకులు భయపడుతున్నారు. వాళ్లు విధ్వంసక కార్యకలాపాలను అనుసరిస్తే పోర్చుగీసులు మరింత దారుణంగా అణిచివేయ ప్రయత్నిస్తారని వీళ్లు భయపడుతున్నారు. సత్యాగ్రహులమీద అత్యంత దారుణ చర్యలు తీసుకున్న పోలీసు అధికారి కస్మీరోమాంట్ లోనూ

గోవా గవర్నర్ జనరల్ సముచితంగా ప్రశంసించినట్లు నేడు గోవా రేడియో చేసిన ప్రకటనను చూస్తే, పోర్చుగీస్ వైఖరి, గోవా జాతీయవాదులకు రాగల కష్టాలు తెలుస్తున్నవని వీరు అంటున్నారు.

### కాంగ్రెసేతర నాయకుల ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 5: గోవా సత్యాగ్రహాన్ని వారిస్తూ అఖిలభారత కాంగ్రెస్ సంఘం చేసిన తీర్మానం ఆ సమస్యపట్ల భారతజాతి విధానాన్ని సూచిస్తుందని తాము అంగీకరించేది లేదని భారత కాంగ్రెసేతర నాయకులు 11 మంది నేడొక ప్రకటన చేశారు. గోవా నేషనల్ కాంగ్రెస్, గోవా విమోచన సమితి ఢిల్లీలోని తమ సంఘాలను తక్షణం సమావేశపరిచి భవిష్యత్కార్యక్రమాన్ని చర్చించాలని వీరు సూచించారు.

ఈ ప్రకటనమీద శ్రీయుతులు ఎన్. సి. చటర్జీ, ఆచార్య కృపలానీ, అశోక మెహతా, ఎ. కె. గోపాలన్, భూపేశ్ గుప్తా, హీరేన్‌ముఖర్జీ, వి. జి. దేశ్‌పాండే, లంక సుందరం, వి. వి. ఘాటే, వసంతిరావ్ ఓక్, శ్రీమతి సుచేతా కృపలానీ సంతకాలు చేశారు.

ఆ ప్రకటనలో ఈ విధంగా ఉన్నది: "గోవా సమస్య మీద 4 వ తేదీన అఖిల భారత కాంగ్రెస్ సంఘంచేసిన తీర్మానం దేశమంతటినీ ఆశ్చర్య చకితంచేసింది. దేశంలో అన్ని పార్టీలు కలిసి జాతీయ విధానంగా గోవాపట్ల వ్యవహరిస్తుండగా, ప్రభుత్వపక్షం ఇతరులెవరినీ సంప్రదించకుండా, ఆ ఐక్యతను భగ్నపరిచే చర్యతీసుకోవటం శోచనీయం.

స్వాతంత్ర్యదినం నాడు గోవాలో సత్యాగ్రహులు ప్రవేశిస్తున్నప్పుడు ప్రధాని నెహ్రూగారే తన శుభాకాంక్షలను తెలిపారు. ఆ తరవాత ధైర్యంగా తుపాకిగుళ్ళను ఎదుర్కొన్న సత్యాగ్రహుల ధైర్య సాహసాలను, దేశభక్తిని ప్రశంసించారు. దేశంలో పోర్చుగీస్ వలసవాదపు దుర్గాన్ని కూలద్రోస్తానని ఆయన ఉద్ఘాటించిన వెంటనే అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఇటువంటి తీర్మానం చేయటంవల్ల అగ్యాన్నత పో... యిలోకి వెళ్లిన ప్రజోత్సాహాన్నే కూలద్రోయటం జరిగింది. ఈ తీర్మాన ఫలితం ఏమిటంటే, పోర్చుగీస్ ఫాసిస్టు నియంతృత్వాన్ని దైన్యంగా ప్రతిఘటిస్తున్న గోవా ప్రజలను భారతదేశంలోని అధికారపక్షం వాళ్లి కర్మానికి వాళ్లను వదిలివేయటమే.

## పోనహర్ను నియోజక వర్గపు ప్రజాపార్టీ

విశాఖపట్టణం, సెప్టెంబరు 4: ఈ క్రిందివారిని పొన్నూరు నియోజకవర్గపు ప్రజాపార్టీ సభ్యులుగా ఎన్నుకు చేశారు. ఆగరాపురపు శేషగిరిరావు, అప్పాసాని పిచ్చయ్య, ఈమని నాగిరెడ్డి, డాక్టరు అల్లం రామయ్య, మొవ్వ వెంకటకృష్ణయ్య, అంబటి తిరుపతి రాయుడు గార్లు.

## పోరాడవలసింది గోవా ప్రజలే

గోవా నేషనల్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ జనార్దన్ షింక్రే నేడుసాయంత్రం పత్రికా ప్రకటన చేస్తూ అఖిల భారత కాంగ్రెస్ సంఘం గోవామీద చేసిన తీర్మానాన్ని సమర్థించారు.

"గోవా విమోచనోద్యమం"లో ప్రధానంగా పోరాడవలసింది గోవా ప్రజలే నన్న సంకల్పంతోనే మేము మొదటి నుంచీ పనిచేస్తున్నాము. గోవా ప్రజలకు కావలసిందల్లా భారతీయుల సానుభూతి మాత్రమే" అని ఆయన ఉద్ఘాటించారు.